ఓం

# వైదిక చికిత్సా పద్ధతి

వేదమునం దనేక విధములగు చికిత్సాపద్ధతులు వర్ణింపబడియున్నవి. కొన్ని పద్ధతులు సవిస్తరముగను కొన్ని సంక్షేపముగను వర్ణింపబడినవి. విచారశీలుడగు వైద్యోత్తము డీ వైదిక-చికిత్సాపద్ధతి నావశ్యకముగా మననము చేయవలయును.

వేద మీ చికిత్సాపద్ధతులద్వారా మనుష్యులను స్థూలతత్త్వమునుండి సూక్ష్మతత్త్వమువఱకును దీసికొని వెళ్లుచున్నది. మనుష్యులయొక్క స్థూల శక్తులకంటె సూక్ష్మ శక్తులవిషయమునం దధిక ప్రేమోత్పత్తిని చేయుటయే యథార్థమగు ధర్మము యొక్క ముఖ్యాభీష్టము. స్థూలపదార్థముల శక్తి యొక్క జ్ఞానము మనుష్యులకు స్థూలదృష్టితో తెలియుచున్నది; ఏలయన అది ప్రత్యక్షముగ నున్నది. సాధారణముగ మనుష్యప్రవృత్తి ప్రత్యక్షమగు వ్యక్తదృష్టియందు రమించుచున్నది. విశేషకారణము లేక మనుష్యుడు అప్రత్యక్ష అవ్యక్త అదృశ్యములవంట పరుగెత్తుటకు కోరడు. కోరుట లేదు. ఎవ్వారలు విచారణసహిత నేత్రములతో సృష్టియొక్క నిరీక్షణమును అహర్నిశము చేయుచున్నారో, వారి కీదృశ్యస్థూలజగత్తునం దొక అదృశ్యసూక్ష్మతత్త్వము కనుబడుచున్నది. ఎప్పుడు వారికా తత్త్వముయొక్క సాక్షాత్కార మట్లేయగుట కారంభించుచున్నదో అప్పుడు వారిభక్తి స్థూలముపైకంటె సూక్ష్మమునం దధికముగ దృఢమగుచున్నది. ఏలయన సూక్ష్మముయొక్క సామర్థ్యము స్థూలముకంటె అనేకరెట్లధికముగ నున్నది. ఈవిషయము వివిధమగుచికిత్సా పద్ధతులయందును గోచరమగుచున్నది. ప్రథమావస్థయందు మనుష్యుల ప్రేమ ఓషధులు, పండులు, మాత్రలు మొదలగువానిపై విశేషముగ నుండును. ఇది

స్థూలముపై ప్రేమ. మానసికచికిత్సచేయక నే శరీరములో మందులను కుక్కు చున్నవారెల్లరు స్థూలదృష్టిగల వైద్యులు. మనస్సునకు శరీరమంతయు స్వాధీన మగుచున్నది. మనస్సు బలహీనమైనది కానంతవఱకే రోగములు మానవుని దగ్గఱకు రాజాలవు. కనుక ప్రతిరోగికి మానసికచికిత్స ప్రథమమున జరుపుట ముఖ్యావశ్యకమైయున్నది. ఈవిషయము సూక్ష్మతత్వదర్శనాన్వేషులగు అమెరికావారికి గోచరించినది.

In the heroic days of the Veda-Writers the Physician of the body was also the Physician of the mind. Dt. Axil Emil Gibsons Health Culture Vol. XXVI No. V May, 1920)

"వేదకర్తలయొక్క వీరయుగమునందు శారీరకచికిత్సకుడు మానసిక చికిత్సకుడుగ గూడ నుండెను."

డా॥ గిబ్సన్ గారు.

ఈ మ. గిబ్సన్ మహాశయుని కథనము పూర్తిగ సత్యమే కాని దీనియం దాశ్చర్యకరమగు విషయ మిదియే. ఏవిషయము మ. గిబ్సన్ గారికి విదితమయ్యెనో అప్పటివఱ కది ఆర్యదేశీయవైద్యులకు విదితము కాలేదు.

వేద మౌషధచికిత్సను చెప్పుచున్నది. కాని దానియాకర్షణ మంతయు సూక్ష్మమగు మానసికచికిత్సయందే యున్నది. ఏభద్రపురుషు లీవేదమంత్రము లను సూక్ష్మదృష్టితో చూతురో వా రాసమయమునందే వేదాకర్షణ మెంత ప్రబలముగ నున్నదో తెలిసికొనగలరు. ఈవిషయమునుమాత్రి మిప్పుడు స్పష్టము చేయవలసియున్నది.

## (౧) దివ్యమైన వైద్యుడు.

యత్రౌషధీః సమగ్మత రాజానః సమితామివ
విప్రః స ఉచ్యతే భిషగ్రక్షోహామీవ చాతనః॥

ఋగ్వే. మం.౧౦ - సూ ౯౭- మం. ౬.

అర్థము—ఏవిధముగ రాజు ప్రజలు అథవా క్షత్రియులు, సమితాం ఇవ = సభయం దేకత్రితమగుచున్నారో, అవిధముగ, వి - ప్రః = విశేష ముగ జ్ఞానముగల మానవుని మాత్రమే, భిషక్ = వైద్యుడు అని చెప్పు చున్నారు. వాడే, రక్షో - హా = రాక్షసులను హననముచేయువాడు. మఱియు, అమీవ - చాతనః = రోగములను దూరముచేయువాడు — చెప్పబడుచున్నాడు. ఈ మంత్రములో వైద్యుని లక్షణము చెప్పబడి యున్నది. (1) ఔషధముల నన్నిటిని తనదగ్గఱ నుంచుకొనెడివాడు. (2) తన శాస్త్రమును సాంగోపాంగముగ నధ్యయనము చేసియున్నవాడు. (3) యుక్తిచే యోజనచే, భిషజ్యతి = రోగములను దూరముచేయగలవాడు. (4) రాక్షసులను నాశనము చేయగలవాడు. (5) రోగములను సమూలముగ, చాతనః = వెల్లగించివేయువాడు. వైద్యునిలక్షణము లైమను పైమంత్ర మున చెప్పబడియున్నవి, "రక్షః, రాక్షస, అసుర" ఈ శబ్దములు విశేషార్ధ ములతో వైద్యశాస్త్రములో వర్ణింపబడియున్నవి. ఇవి సజీవప్రాణధారులగు సూక్ష్మప్రాణులైయున్నవి. అవి మనుష్యనేత్రములకు కూడా కనబడవు. శతపథములో వీటిని గురించి చెప్పబడియున్నది.

తదనధునేత, అవధూతం రక్షః, అవధూతా అరాతయః
ఇతి, తన్నాష్ట్రా ఏవైతద్రక్షాం స్యతోఽపహంతి॥

శత. బ్రా-౧-౧-౪.

"అది చర్మమును బలాత్కారముగా లాగుకొనునదనియు అందుచే రాక్షసులు, అసురులు నాశనమగుదురనియు చెప్పబడియున్నది. ఈ విధముగ వినాశమును గలుగజేయు రాక్షసులయొక్క సంహారమగుచున్నది." అనగా చర్మమును బలాత్కారముగ లాగుటచే దానియందు దాగియున్న రాక్షసులు క్రిందబడి నశింతురు. రాక్షసులు చర్మములో దాగియుందురు. వారు మనుష్యుల నేత్రములకు కనుబడరు. బలాత్కారముగ లాగుటచే దూర

ఈ మంత్రములో వైద్యునిముఖ్యలక్షణ మొకటి చెప్పబడియున్నది. అది యిది. "వైద్యుడు సత్యరూపుడగు బ్రాహ్మణుడు కావలయును. అనగా బ్రహ్మజ్ఞానయుక్త వైద్యుడు కావలయును." వైద్యుడు ఆత్మజ్ఞానము గలవాడే కావలయును; కలవాడైయుండవలయును. ఆత్మ, బుద్ధి—మనస్సు మొదలగువాటిని సూక్ష్మతత్త్వములయొక్క గుణధర్మములను తెలిసినవాడే వైద్యుడుగ నుండవలయును; కావలయును. ఇతరులు—ధనార్థులు వైద్యులుగ నుండకూడదు. ధనార్థులై వైద్యము చేయఁగూడదు. వైద్యవ్యవసాయము వాస్తవముగ దైవవ్యవసాయ మైయున్నది. కాని లోభత్వకారణముచే నితరపనులకు సమానముగా నిదికూడ రాక్షసులచేఁ జేయబడుచున్నది. ఆత్మజ్ఞానముగల వైద్యులిక్కాలమున నేదో పవిత్రవంతమగు ప్రదేశములో నుండిన నుండవచ్చును. కాని లేకపోలేదు.

ఈ మంత్రములో నౌషధములతో సోముని పేరు వచ్చియున్నది. సోమశబ్దార్థము సోమవల్లి—చంద్రుడు—పరమాత్మ. చంద్రునకు షోడశ కళ లున్నవి. జీవునకు షోడశకళ లున్నవి. ఇది "షోడశీ ఇంద్ర అని" వేదములో కూడ చెప్పబడియున్నది. సోమవల్లికిఁ గూడ శుక్లకృష్ణపక్షములయందు చంద్రునివలె క్షీణవృద్ధ్యవస్థ లున్నవని చెప్పుచున్నారు. చంద్రునకును, సోమవల్లికిని సంబంధము గలుగఁజేయుటవలన సోమవల్లికి కూడ ౧౬ కళ లుండుట ఆవశ్యకమని యూహింపబడుచున్నది. శోధక వైద్యులీవిషయమును విచారించెదరుగాక !

ఔషధవాచక సోమశబ్దము ఆత్మవాచక మగుటవలన స్థూలౌషధ నామముచే సూక్ష్మమగు ఆత్మతత్త్వ మిచట సూచింపబడెను. వేదము ప్రతిమాటకు పాఠకులను సూక్ష్మతత్త్వముదగ్గఱకు నెట్టివేయుచున్నది. ఇప్పుడు వేదములో చెప్పబడిన యోషధులను చూడుడు.

పిప్పలీః క్షిప్తభేషజీః ఉతాతివిద్ధభేషజీః
తా దేవాః సమకల్పయన్ ఇయం జీవితవా అలమ్॥

అథర్వవే. కాం ౬. సూ ౧౦౯. మం ౧.

అర్థ—పిప్పలినామక ఔషధము క్షిప్త-అతివిద్ధరోగముల కత్యంతముపయోగిమైయున్నది. ఈయోషధి యొక్కటియే జీవాతువై =జీవించియుండుటకు, అలం=పర్యాప్తమైయున్నది. ఇటు దేవతలు కల్పనచేసియున్నారు, అర్థాత్ పరమాత్మునిచే దీనియం దీగుణము కల్పనచేయబడియున్నది.

ఏ రోగములో మనుష్యుడు పిచ్చివానివలె నగుచున్నాడో, ఆ రోగమును క్షిప్తమని చెప్పుచున్నారు. రోగముచే మిక్కిలి యావరింపబడియున్నటువంటి రోగముపేరు 'అతివిద్ధ'మని చెప్పుచున్నారు. వీనికి, ఈరోగములను తొలగించుటకు పిప్పలీఓషధి అత్యంతఉత్తమమైయున్నది. ఇంతియే కాదు గాని, ప్రాణిమాత్రుల జీవనముకొఱకు. అర్థాత్ సంపూర్ణఆరోగ్యమును ప్రాప్తింపజేయుటకీ యోషధిమాత్రమే పర్యాప్తమైయున్నది.

మఱియు—

శ్యామాస రూపంకరణీ పృథివ్యా అధ్యుద్భృతా।
ఇదమూషు ప్రసాధయ పునా రూపాణి కల్పయ.

అథర్వవే. కాం ౧-సూ ౨౪-మం ౪.

అర్థ—శ్యామనామక వనస్పతి, యేది, భూమికి పైన వృద్ధిపొందుచున్నదో, అది శరీరరంగు (రూపు)ను బాగుచేయుచున్నది. ఈవనస్పతిచే (పునః) మఱల శరీరముయొక్కరూపు బాగగుచున్నది.

శరీరముపై శ్వేత కుష్ఠముమచ్చలేవి పుట్టుచున్నవో, మఱియు పన్యవిధమగు కుష్ఠముచే శరీరము విరూపమగుచున్నదో, ఆరోగములనుండి శ్యామా ఓషధి రక్షించి పునః పూర్వవతుగ, సుందరరూపునిగ చేయుచున్నది; చేయును. ఈవిధముగా ననేక ఓషధులవర్ణన వేదములయం దున్నది. ఇచట కేవలము

సూచనగ మాత్రమే చెప్పబడియున్నది. కనుక నింతరమే పర్యాప్తమై యున్నది. ఓషధులప్రయోగముచే ఆరోగ్య సంపాదనయొక్క స్థూల మార్గ మిదియే. ఓషధులు లేనిచో పెద్ద పెద్ద వైద్యులుకూడ నేమియు చేయ జాలరు. ఈమార్గమున కాపత్తి యిదియే. పరాధీనతచే దుఃఖము; స్వాధీనతచే, స్వతంత్రతచే - సుఖముగలుగుచున్నది. ఓషధులయొక్క అవలంబనరూప పరాధీనత యీమార్గమం దున్నది. కాబట్టి వేదము జలచికిత్సను చెప్పి యున్నది. అర్థాత్ సుగమోపాయ స్వాతంత్ర్య జల చికిత్సా మార్గమును చూపియున్నది.

## ౩. జల చికిత్స.

వేదములో జలచికిత్స యేవిధముగా నుండెనో "జల - విద్యా" నామకపుస్తకములోఁ జెప్పబడియున్నది. కాబట్టి దానిని మఱల నిచట విశేషముగా వర్ణించుట కావశ్యకత లేదు. కాని ఒకటిరెండుమంత్రము లిచట నమూనాకై యీయబడుచున్నవి.

అప్సు మే సోమో అబ్రవీ దంత ర్విశ్వాని భేషజా।
అగ్నిం చ విశ్వశంభువ మాపశ్చ విశ్వభేషజీః.
ఋగ్వే. మం ౧. సూక్త ౨౩-మం ౨౦.

అర్థ—జలములలో నీటిలో నౌషధము లన్నియు నున్నవని సోముడు నాకు జెప్పెను. అన్ని యౌషధములు జలమే. మఱియు నగ్నియు నారోగ్యము నంతయు సమకూర్చెడి దైయున్నది."

ఈమంత్రములో కేవలము జలప్రయోగముచే రోగము లన్నియు నివృత్తములగును." అని సూచింపబడియున్నది. ఈమంత్రములోనే అగ్నిచికిత్స యొక్క సూచన కూడ దొరకుచున్నది. కాని యీవిషయము నిచట వ్రాయుటకై స్థానములేదు. అగ్నిచికిత్సావిషయము నితరసమయమున సవిస్తారముగా

వ్రాయుదుము. ఏలయన నీ చికిత్స కనేకవిభాగము లున్నవి. అందుచే నిచట వ్రాయజాలము.

అప్స్వ న్త రమృతం అప్సు భేషజం॥

ఋగ్వే. మం ౧. సూ ౨౩. మం ౧౯.

"జలమం దమృత మున్నది. జలములో నౌషధులు, మందులు ఉన్నవి."

ఈ విధముగా నుదకముయొక్క వర్ణన వేదములో వచ్చుచున్నది. మఱియు జలచికిత్సకు సూచన లిచ్చుచున్నది.

అప ఇద్వా ఉ భేషజీ రాపో అమీవ చాతనీః

ఆపః సర్వస్య భేషజీ స్తా స్తే కృణ్వన్తు భేషజమ్॥

ఋగ్వే. మం ౧౦ సూ-౧౩౭. మం ౬.

అర్థ—జలము నిస్సందేహముగా నౌషధమైయున్నది. జలము నిస్సంశయముగా రోగములను దూరముచేసెడిదై యున్నది. జల మన్నిరోగములకు నొకటే మందు. ఆ జలము మీకై ఔషధముగా చేయబడియున్నది.

ఈ మంత్రములో 'నొక జలప్రయోగముచే రోగము లన్నియు సంపూర్తిగా దూరము కాగలవు' అని స్పష్టముగా వ్రాయబడియున్నది. జలాభిషేంచనము - ఉపసేంచనము మొదలగు విధులు అథర్వవేదములో వ్రాయబడియున్నవి. నానావిధములుగ జలము నుపయోగముచేయు పద్ధతులయొక్క సూచన అశబ్దములయందు దొరుకుచున్నది. 'ఒకజలమే రోగము లన్నిటిని శమనముచేయు (దూరముచేయుటకు) పర్యాప్తమై యున్నట్లైతే యితరములగు మందుల కేమి యావశ్యకత యున్నది' అని ప్రశ్న యుత్పన్నమగుచున్నది. జలమన్నిదేశములలో, అన్నికాలములలో దొరకగలదు. ఓషధు లన్నికాలములలో, అన్నిదేశములలో దొరుకుటలేదు. కాబట్టి ఓషధీచికిత్సకునికంటె, జలచికిత్సకులకు - జలచికిత్సను చేయువారికి, అధిక స్వాతంత్ర్యము మున్నది. ఓషధులతో, మందులతో పోనటువంటి కఠినత్వము - క్రూరవ్యాధులు -

జలచికిత్సచే తొలగి కుదిరియున్నవి. దీనిలో సందేహ మేమియు లేదు. జల చికిత్సలో మందులయం దుండు మిక్కిలి వేడిచే, కాఠిన్యముచే, చేదులచే నోరు చెడిపోవునను భయములేదు. ఓషధి- మందులచికిత్స - స్థూలము. అర్థాత్ పార్థివచికిత్స యైయున్నది. దానికంటె సూక్ష్మము జలతత్త్వముయొక్క ఆశ్రయమగుటచే జలచికిత్సవలన మనుష్యుడొక మెట్టుపైకి చేరుచున్నాడు. ఏలయన, ఎవని విశ్వాసము జలచికిత్సయం దుండునో వాని మనసులో సూక్ష్మతత్త్వముయొక్క శక్తికల్పన జాగరితమగుచున్నది. అర్థాత్ మేలుకొనుచున్నది. ఇక్కాలమున జలచికిత్సను విశ్వసించని వైద్యు లనేకు లున్నారు. ఎట్లు ఔషధచికిత్సచే రోగులదగ్గఱనుండి యెంతధనము లాగికొనుటకు వీలగుచున్నదో, అట్లు అంత యధికధనము రోగులదగ్గఱనుండి లాగికొనుటకు వీలు గలుగుటలేదు. ఇది వైద్యులకు సదుపాయమైన మాట కాదు. కాని రోగులకు సదుపాయము - ఉన్నది. జలచికిత్సచే నధిక మగుచున్నది. దీనికి మూలకారణ మిదియే. దీనిలో సూక్ష్మతత్త్వముయొక్క ఆశ్రయ మగుచున్నది. అర్థాత్ సూక్ష్మతత్త్వముయొక్క స్థాన మున్నది. ఏ ప్రాణితో సూక్ష్మతత్త్వముయొక్క ఆశ్రయ ముండునో, ఆప్రాణి యధికోన్నతి, అధికసుఖము మనుష్యునకు ప్రాప్తమగుచున్నవి. ఇది వైదికధర్మముయొక్క సిద్ధాంతము.

## ౪ అగ్ని చికిత్స

"అగ్నిం చ విశ్వ-శం-భువం" ఇట్లు పూర్వస్థలములో చెప్పబడియున్నది. సంపూర్ణ (- శం - ) శాంతిని - ఆరోగ్యమును - (భువం) ఇచ్చునది అగ్నియైయున్నది. అర్థాత్ సంపూర్తిగా దోషములను అగ్ని దూరము చేయగలదు. రాక్షసులను నాశనముజేయుట వైద్యుని కొక కర్తవ్యమైయున్నది. వేద మీవిషయమును పూర్వస్థలములో జెప్పియున్నది. అగ్ని నామముకూడ "రక్షో—హా" అనగా రాక్షసులను నాశనముచేయువాడు

ఈయర్థమునకు ద్యోతకమగుచున్నది. అగ్నిద్వారా రెండవ చికిత్స హవన చికిత్స. అగ్నిచికిత్సావర్ణన సవిస్తరముగా నితరగ్రంథములలో జేయబడినది.

### హవన చికిత్స

వేదములలో హవనమునకు చాలగొప్పశాస్త్ర మున్నది. దీనికి పూర్తిగా నావిష్కారము కాలేదు. కాని, యేవిషయము లిప్పుడు సమ్ముఖమునకు వచ్చి యున్నవో, వానివలన నింత స్పష్టమగుచున్నది. హవనముచే రోగములు శమనము శాంతి చేయబడుచున్నవి. ఈవిషయమై యీపుస్తకములో ఒకమంత్ర మును మాత్రమే చూడుడు*

ముంచామి త్వా హవిషా జీవనాయ
క మజ్ఞాత - యక్ష్మా దుత రాజయక్ష్మాత్ ॥

“హవనముద్వారా అజ్ఞాతరోగములనుండియు, మరియు **క్షయ**రోగము నుండి **కూడ** మిమ్ములను దీర్ఘజీవనమునకొఱకు విడుదలచేయుచున్నాను.”

హవనముచే జ్ఞాతరోగములు దూరము కాగలుగుచున్నవి. కాని, అజ్ఞాతరోగములుకూడ దూరము కాగలుగుచున్నవి. రోగము లన, నిదానము మరియు చికిత్సాపద్ధతి స్పష్టముగ, విదితమగుచున్నవో ఆరోగములనామము “జ్ఞాతయక్ష్మము” అయియున్నది. మరియు దేని నిదానము, ఉపశమనోపాయము తెలియదో అది “అజ్ఞాతయక్ష్మము” అని చెప్పబడు చున్నది. దీనిని రాజయక్ష్మమని, క్షయరోగమని-నామములతో బిలుచు

---

* హవనపద్ధతిని గుఱించి బాగుగా తెలిసికొనగోరువారు ఆర్యనారాయణమూర్తిగారిచే వ్రాయబడిన ‘అగ్నిహోత్రపద్ధతి’యను గ్రంథమును చదువవలయును.

వలయువారు:—

ఆర్యనారాయణమూర్తిగారికి, హిందూపురము, అనంతపురము జిల్లా, అని వ్రాసినచో బడయగలరు.

చున్నారు. ఇది ఆరోగము లన్నిటికి రాజు. ఎచ్చటకొక పర్యాయ మిది చేరు చున్నదో అచ్చట ఆరోగిని తీసికొనియే వెళ్ళుచున్నది. ఈవిధమగు భయానక క్షయరోగముకూడ హవనచికిత్సద్వారా నాశనమగుచున్నది. తిరిగి యితర రోగములుకూడ దూరమగుచున్నవి, అని చెప్పుట కేమి యావశ్యకత యున్నది?

ఋషికాలములో యజ్ఞవిధికి మిక్కిలి గౌరవ ముండెను. యజ్ఞముతో వర్షములను కురిపించి ధాన్యమునకు మిక్కిలి బలము కలుగచేయబడు చుండెను. వాయువును శుద్ధిచేసి దాని ప్రసన్నత ప్రాప్తము చేసికొన బడుచుండెను. సుపుత్రోత్పాదనకై పుత్రకామేష్టియజ్ఞములు చేయుబడు చుండెను. ఇది దైవభావనయజ్ఞముల స్వరూపమై యున్నది. రాక్షసభావ యజ్ఞములు కూడ ప్రచలితములై యుండెను. ఈ రాక్షసయజ్ఞముల ద్వారా శత్రునగరములలో రోగము లుత్పత్తిచేయబడుచుండెను. వీని ప్రవర్తనము రాక్షసులదగ్గఱనుండి జరుగుచుండెను.

తాత్పర్యము—హవనముచే నొక విశేషశక్తి పుట్టియున్నది. అది యున్నతిమార్గములో, వినాశకమార్గములో ప్రయోగము చేయుబడుచున్నది. వైదికవాఙ్మయములో యజ్ఞముయొక్క ఉజ్జ్వలస్వరూపము లన్నియు కన బడుచున్నవి. ఏల యన వైదికవాఙ్మయముయొక్క ప్రవృత్తి దైవప్రవృత్తి యైయున్నది. పైశాచ - అసుర గ్రంథములలో రాజసతామసఘోరహవన ములయొక్క విధులు వ్రాయబడియున్నవి. వానివలన పై భయానకపరిణామము లగుచున్నవి,

శ్రేష్ఠమగు సాత్వికయజ్ఞములచే, హవనములచే నారోగ్యము వృద్ధి యగును. ఘోరములగు నితరహవనములచే వ్యాధులు పుట్టి వృద్ధియై వ్యాపించును. శ్రేష్ఠమగు దైవయజ్ఞములవర్ణన గోపథబ్రాహ్మణ మీక్రింది విధముగ చేయుచున్నది.

భైషజ్య యజ్ఞావా ఏతే త స్మాదృతుసంధిషు,
ప్రయుజ్యంతే ఋతుసంధిషు వై వ్యాధి ర్జాయతే॥
గోపథబ్రా ఉ. ౧. ౧౯ ॥

"ఇవి యోషధియజ్ఞము లైయున్నవి. కనుక ఋతువులయొక్క సంధు లలో యజ్ఞములు చేయబడుచున్నవి. ఏలయన, ఋతుసంధులలో రోగములు పుట్టుచున్నవి."

రోగనివారణము—ఆరోగ్యసంపాదనము, ఈసాత్వికయజ్ఞముయొక్క భాగమును ముఖ్యము నైయున్నది. అర్థాత్ ఈసాత్వికయజ్ఞముయొక్క భాగము ముఖ్యముగా రోగములను నివారించి ఆరోగ్యమును సంపాదించి యిచ్చుట యైయున్నది. ఈవిధముగా యజ్ఞచికిత్సయొక్క స్వరూపము కొద్దిగా నున్నది. పార్థివ, జల, అగ్ని మొదలగు వానిచే చికిత్స చేయుపద్ధతి ఈవిధముగా వేదములలో నున్నది. "అప్" శబ్దముచే జలతత్త్వముయొక్క బోధ యెట్లగు చున్నదో అవిధముగ అట్లు ఆత్మతత్త్వముకూడ తెలియుచున్నది. మరియు, 'అగ్ని' శబ్దముచే తైజసతత్వము తెలియుచున్నప్పటికిని పరమాత్మయొక్క బోధ యగుచునేయున్నది. ఈవిధముగా వేద ముచ్చతత్త్వములద్వారా కేవలము చికిత్సలను చూపుటలేదుగాని ప్రతితత్వవాచకశబ్దముద్వారా ఆతత్త్వముక్రింద గుప్తరూపముతో విద్యమానమైయున్న ఆత్మతత్వమును సాక్షాత్కారము చేయుచున్నది. ఈవిషయమెప్పుడు మఱువకూడదు. అగ్నిచికిత్సలో - సూర్యుడుకూడ ఆగ్నేయతత్వ మగుటచే సౌరచికిత్సనుకూడ ని ప్రకరణములో విచారించుట యోగ్యమైయున్నది.

## ౬ సౌరచికిత్స

సూర్యకిరణములద్వారా చేయబడునది సౌరచికిత్స. సూర్యకిరణము లను పవిత్రత నుత్పత్తిచేయుటయే ధర్మమని వేదములో "శోచిష్-కేశం" ఈశబ్దముద్వారా చెప్పబడియున్నది. కొంబట్టి వేదము చెప్పుచున్నది.

నః సూర్యస్య సందృశో మాయుయోధాః ॥

ఋగ్వేద. మం. ౨ సూ 33 మం. ౧॥

అర్థ— "సూర్యప్రకాశముతో మనకు వియోగ మెప్పుడును కలుగ కూడదు." ఏలయన, సూర్యుడే అన్నివిధములగు దోషములను దూరముచేసి-తొలగించి ప్రాణులకు పుష్టి నిచ్చుచున్నాడు. ఇంతవఱకు వేదము చెప్పుచున్నది.

సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ"

ఋగ్వే. మం. ౧ - సూ ౧౧౫ - మం, ౧॥

"సూర్యుడు స్థావరజంగమములజగత్తున కాత్మయై యున్నాడు."

సూర్యుడు ప్రాణరూపి యగుటచే నత డన్నిటి కాత్మయై యున్నాడు. వాడు నశించుటచే ప్రాణిమాత్ర మంతయు నష్టమగుచున్నది." అని యీ మాట ప్రశ్నోపనిషత్తులో చెప్పబడియున్నది.

ఆదిత్యో హ వై ప్రాణః ప్రశ్న. ఉ. ౧. ౫.

యత్సర్వం ప్రకాశయతి తేన సర్వాన్

ప్రాణాన్ రశ్మిషు సంనిధత్తే ప్రశ్న. ఉ. ౧. ౬.

"నిశ్చయముగా నాదిత్యుడే ప్రాణము. ఎప్పు డాదిత్యుడు ప్రకాశమాన మగుచున్నాడో, అప్పుడు వా డన్నిప్రాణులను తనకిరణములలో నుంచుచున్నాడు."

తాత్పర్యము—సూర్యకిరణములద్వారా సర్వప్రపంచములో ప్రాణతత్త్వము సంచరించుచున్నది. అర్థాత్ ప్రాణు లన్నియు సూర్యకిరణముల ద్వారా ప్రపంచములో సంచరించుచున్నవి. ఎచ్చట ప్రాణము చేరుచున్నదో అచ్చటనుండి మృత్యువు దూర మగుట స్పష్టమైయున్నది. కాబట్టి సూర్యకిరణములద్వారా ప్రాణ మన్నిగృహములను శుద్ధము చేయగలుగునట్లుగా గేహములను నిర్మాణము చేయవలయును, ఇట్లు చేసి నివసించు గృహమునుండి మృత్యువును తరిమివేయవలయును. రోగోత్పాదకక్రిములు సూర్యకిరణముల ద్వారా నాశనమగుచున్నవి. అని యిట్లుకూడ వేదములో చెప్పబడియున్నది.

సౌరచికిత్సద్వారా రోగులు పెద్దలాభములఁ బొందుచున్నారు. ప్రాణాయామముద్వారా యీప్రాణతత్త్వవాయువును పూర్తిగా లోపలకు దీసికొని, కుంభకముద్వారా ప్రాణమును స్వకీయశరీరములలో స్థిరముచేయుచున్నారు. అన్యప్రకారముగా యుక్తిప్రయుక్తులచే సూర్యకిరణములద్వారా ఆరోగ్యమును సంపాదించుట సౌరచికిత్సయం దున్నది.

వివిధరంగులుగల గోవులపాలు, వివిధములగు ఇష్టానిష్టపరిణామములను సౌరచికిత్సతో (లేక) వర్ణచికిత్సతో సంబంధము నుంచుచున్నవి.

## ౨ వాయుచికిత్స

వైదికధర్మములో ౯ వఅంశములో "ఆయుష్యమును వృద్ధిచేయుడు" అను శీర్షికలో వాయుచికిత్సావిషయముకొద్దిగా వ్రాయబడియున్నది. వాయువులో "అమృతఖజానా" యున్నది, అనియిట్లు ఋగ్వేద, మం ౧౦. ౧౮౬వ సూక్తములోఁ జెప్పబడియున్నది. అమృత మెచట నుండునో అచట రోగము లుండజాలవు. కనుక అమృతముయొక్క ఖజానాను తీసికొని వాయు వెచటకు చేరుచున్నదో అచ్చట నిరోగత్వము ప్రాప్తమగును. ఈవాయుచికిత్స యొక్క మూలము వేదములో నున్నది. మఱియు,

ఆవాతవాహి భేషజం వివాతవాహి యద్రపః
త్వం హి విశ్వభేషజో దేవానాం దూత ఈయసే.

ఋగ్వే. మం. ౧౦. సూ. ౧౩౭, మ. ३౧.

"ఓ వాయువా! నీమందును తీసికొనిరమ్ము. వచ్చి యిచటనుండి దోషము లన్నిటిని దూరముచేయుము. ఏలయన, నీవే ఔషధము లన్నింటితో యుక్తమై యున్నావు."

పృథివి, జలము, అగ్ని వీనికంటె వాయువు సూక్ష్మతత్త్వమైయున్నది. కాబట్టి దీనిచే నారోగ్యమును సంపాదించుట. రోగములను నాశన మొనరించుట, ఇతరములగు విధులకంటె నిది శ్రేష్ఠమైయున్నది. జలమును ప్రాప్తించుకొనుటకు కష్టము లున్నవి. వాయువు సర్వత్ర ఉన్నది. కాబట్టి

దానిని చెడగొట్టకుండినట్లయిన అది సదా అమృతము నిచ్చుటకై సిద్ధమై యున్నది. యోగులు, మునులు, మహర్షులు మొదలగువారు ప్రాణాయామముద్వారా యీప్రాణవాయువుచే నారోగ్యమును, దీర్ఘాయువును సంపాదించుచున్నారు. వాయువును యోగ్యమగు రీతితో నుపయోగపఱచినచో ప్రతి రోగమును నాశన మగును. దానిని సేవించువిధితో పరిచయ ముండవలయును. దయాళుడగు పరమేశ్వరుఁ డమృతమయవాయువును సర్వత్ర నింపించి యున్నాడు. కాని నింపియున్నప్పటికిని అజ్ఞానులగుమనుష్యు లనారోగ్యములో బడి కుళ్ళిపోవుచున్నారు. మనుష్యుడును ప్రతిదినము నూటయిరువదియైదు ప్రాణాయామములను విధిపూర్వకముగా చేయుచుండినట్లైన వానిదగ్గఱ రోగములు నిలుబడజాలవు. విధిని వదలి కార్యమును చేయుటవల్లనే మానవున కవనతి కలుగుచున్నది.

## ౮ మానసచికిత్స

ఇదియే సర్వోత్తమమైన చికిత్స. వేద మీచికిత్స కెంత బల మిచ్చి యున్నదో అంత బల మన్యచికిత్సల కీయలేదు. దీనికి కారణము స్పష్టముగా నున్నది. ఈచికిత్సలో నెట్లు స్వాధీనత యున్నదో, స్వతంత్రత యున్నదో, అటుల నితరమగు నేచికిత్సయందును కాజాలదు: లేదు. ఔషధచికిత్సలో ఔషధముల నాశ్రయించుట అర్థాత్ సేవించుట యగుచున్నది. జలచికిత్సలో నుత్తమమగు జలము ప్రాప్తము కావలయును. హవనకిత్సలో వివిధములగు హవనసామగ్రిని ప్రోగుచేయుట యావశ్యకమై యున్నది. వాయుచికిత్సలో శుద్ధవాయువు లేక కార్యభాగము కాజాలదు. కార్యము జరుగలేదు. సూర్యప్రకాశము, లేక సౌరచికిత్స ఆవశ్యకమై యున్నది. అర్థాత్ ప్రకాశము లేక చికిత్సచేయుట అశక్యమగును.

తాత్పర్యము—బాహ్యసాధనలతో నే చికిత్సలు జరుగుచున్నవో, చేయవలయునో వానియందు పరతంత్రత పరాధీనమైయుండుట ఇతరులపై నాధారపడియుండుట తప్పనిదిగా, విధిగా నున్నది. వేదము మనుష్యమాత్రుల

నేవిధముగానైను పరతంత్రులనుగాఁ జేసియుంచుట కోరుటలేదు; కోరదు. కాబట్టి యీచికిత్సలలో వేదము మానసచికిత్సను చూపియున్నది. దీనిలోనే బాహ్యసాధనలపై నాధారపడియుండుటకు ఆవశ్యకతయే లేదు. ఈ చికిత్స తన ఆత్మబలముతోను, మనస్సుయొక్క యిచ్ఛాశక్తితోను జరుగుచున్నది. ఏవిధమైన రోగమైనప్పటికిని రోగికి ఆత్మీయబల ముత్పన్నమైనట్లైన అథవా చికిత్సకుడు వైద్యుడు తన యిచ్ఛాశక్తిద్వారా వానికి రోగములో బలోత్పత్తిని చేసినట్లైతే, వానికి స్వయముగా రోగము శాంతినొంద నారంభించును. వేదములో మనశ్శక్తి యీవిధముగా వర్ణన చేయబడియున్నది.

యత్ప్రజ్ఞాన ముత చేతో ధృతిశ్చ యజ్జ్యోతి రంతరమృతం ప్రజాసు
యస్మాన్న ఋతే కిఞ్చన కర్మ క్రియతే తన్మే మనః శివసంకల్పమస్తు. ౩

యేనేదం భూతం భువనం భవిష్యత్పరిగృహీత మమృతేన సర్వం
యేన యజ్ఞస్తాయతే సప్తహోతా తన్మే మనః శివసంకల్ప మస్తు. ౪

సుషారథి రశ్వా నివ యన్మనుష్యా న్నేనీయతేఽభీశుభి ర్వాజిన
ఇవ, హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం తన్మే మనః శివసంకల్ప మస్తు. ౬

—యజుః, ౩౪

ఈ మంత్రములలో మనోగుణములయొక్క కథన మున్నది. మాకు గుణము లన్నిటిని నిచట వర్ణనచేయుటకావశ్యకత లేదు. మావిషయముయొక్క సూచన యేశబ్దములద్వారా యగుచున్నదో, దొరకుచున్నదో వానిని మాత్రమే యిచట విచారించెదము.

(౧) యత్ ప్రజాసు అంతః అమృతం = ఏమనసు ప్రాణులలో నమృతరూపమై యున్నదో ఆ యమృతమును సేవించుటచే నన్నిరోగములు దూరమగుచున్నవి. యోగముద్వారా నీ మనశ్శక్తికి వికాసము గలిగినట్లయిన ఆరోగ్యమునకై యేయితర పదార్థముల నాశ్రయించు నావశ్యకతయే యుండదు. అర్థాత్ మనస్సునకు వికాసము గలిగించినట్లయిన నితరములగు మందులను సేవించు నవసరమే యుండదు.

(౨) యస్మాత్ ఋతే కించన కర్మ న క్రియతే_ఏమనస్సు లేక ఏకార్యము-కర్మ-కూడ చేయబడదో, ఇచట బాహ్యకర్మకంటె శరీరము యొక్క అంతర్గతకర్మలవైపునకు మాత్రమే పాఠకులు ధ్యాన మీయవల యును. ఉంచెదరుగాక! చేతులను పైకిక్రిందకు నుంచుట, పొట్టలో పచన కర్మ మొదలగున వన్నియు మనసుయొక్క ప్రేరణవల్లనే యగుచున్నవి. ఏ మనసుయొక్క శక్తిద్వారా నాలుగైదు సేర్లబరువుగల చేతు లెట్లుకావల యునో, ఎట్లు త్రిప్పబడుచున్నవో, ఆమనస్సుయొక్కశక్తిచే రోగబీజములు వానిస్థానమునుండి కించిత్తైనను కదలించబడజాలవు" అని యిల్లెవరును చెప్పజాలరు. శరీరమం దంతటను మనశ్శక్తియే కార్యములు చేయుచున్నది. కాని మనుష్యుడు తనశక్తి కపరిచితుడగు కారణముచే తనస్వాస్థ్యమునకై-ఆరోగ్యమునకై యితరులపై నాధారపడుచున్నాడు: ఆధారపడుచున్నాడు. వాస్తవమున దివ్యమైన వైద్యుడు ఆత్మయే యైయున్నది. అమృతరూపమగు మనసు దాని దగ్గఱ నున్నది. కాని అమృతమహాసాగరములో మునిగి చచ్చెడిమూఢునకు సమానముగా నిదికూడ - వీడుకూడ తన దగ్గరనున్న అమృతమును వదలిపెట్టి వెలుపలి పదార్థములను కష్టములతో సంపాదించుట యందు ఆనంద మున్నదని విశ్వసించుచున్నాడు.

(౩) యేన యజ్ఞః తాయతే — ఏమనస్సుద్వారా "సప్త హోతృ యజ్ఞము" వ్యాపింపజేయబడుచున్నదో రెండు నేత్రములు-రెండు చెవులు_ రెండు ముక్కురంధ్రములు-ముఖమొకటి-ఈయేడు హోతృగణము_ఈ యేడు గురు డేనియందు కూర్చుండియున్నారో అటువంటి యీ పురుషరూప యజ్ఞము మనస్సుద్వారానే నడిపింపబడుచున్నది. ఈయజ్ఞములో మనస్సే బ్రహ్మ. యజ్ఞదోషములను దూరముచేయుట బ్రహ్మపని. మనోబ్రహ్మ రూపునియధికార మిదియే.

తాత్పర్యము—శరీరదోషము లన్నియు మనస్సుద్వారా దూరముచేయ బడగలుగుచున్నవి. దోషములు దూరమైనతరువాత నీరోగములునుండ నేయుం

దవు. ఎంతవఱకు దోషములుండునో అంతవరకు రోగములు పుట్టుచుండును.

(ర) సుషారథిః అశ్వాన్ ఇవ=ఉత్తమమగు సారథి యేవిధముగా గుఱ్ఱములను నడిపించుచున్నాడో ఆదేవిధముగా నీమనస్సు మనుష్యులను నడిపించుచున్నది. ఇదియే దీనియొక్క ముఖ్యమైన-మహత్తరమైన-శక్తిఅయి యున్నది. కాని మనుష్యులజ్ఞానకారణముచే తమశక్తి కపరిచితులైయున్నారు. ఇది అన్నిటికంటె ఆశ్చర్యకరము కాదా?

తాత్పర్యము:-మనసునకు విలక్షణమైన శక్తియున్నది. కనుక మానస చికిత్సయే అన్నిటికంటె శ్రేష్ఠమైన చికిత్స. దీనిచే తన రోగములను-ఇతరుల రోగములనుకూడ దూరముచేయవచ్చును, చేయబడుచున్నవి. హస్తస్పర్శ ద్వారా రోగములను దూరముచేయువిధాన మీక్రింది మంత్రములోనున్నది.

హస్తాభ్యాం దశశాఖాభ్యాం జిహ్వా వాచః పురోగవీ,
అనామయిత్నుభ్యాం త్వా తాభ్యాం త్వోపస్పృశామసి॥
ఋగ్వే. మం. ౧౦, సూ. ౧౩౭- మం. ౭.

"పదిశాఖలు దేని కున్నవో, అటువంటి నారెండు చేతులతో మిమ్ములను స్పర్శచేయుచున్నాను. ఈ నాచేతులు (అనామయిత్నుభ్యాం) నిరోగమును చేసెడివై యున్నవి. అర్థాత్ రోగములను నాశనము చేసెడివై యున్నవి. మరియు వానితో నేను (వాచః) నావాణిని (వాక్కును) ప్రేరితము చేయుచున్నాను.

పదివ్రేళ్లు చేతులకు శాఖలైయున్నవి. వీటిచేస్పర్శ చేయుటచే నితరుల రోగములు దూరమగును, కాగలవు.

ఇచట వేదముయొక్క వివిధచికిత్సల పద్ధతులును విశేషరూపముతో చూపియున్నాము. వేద మేవిధముగా స్థూలమునుంచి సూక్ష్మతత్త్వమువఱకు తీసికొని వెళ్లుచున్నదో దీని వర్ణనపూర్వ కొద్దిగా చేయబడియున్నది.

## ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు.

క్రొత్త క్రొత్తగ కనిపెట్టబడుచుండు జలచికిత్స, వాయుచికిత్స, పృథ్వీచికిత్స, సూర్యకిరణచికిత్స, విద్యుత్ చికిత్స, ఉపవాసచికిత్స, శరీరమర్దనచికిత్స, వ్యాయామచికిత్స, కశేరుకాసమీకరణచికిత్స, పథ్యచికిత్స, విశ్రాంతిచికిత్స, మానసికచికిత్స, ఆధ్యాత్మికచికిత్స మున్నగు ననేకవిధములగు చికిత్సాపద్ధతులు దెలుపబడు చుండును. ఏయేచోటులలో నెవరెవరు, ఏయేరోగములను ఏయేచికిత్సావిధానములమూలమున, ఎట్లెట్లు నివారింపజేసికొనిరో వారి రోగ నివారణవృత్తాంతములును, రోగుల ప్రశ్నలకు సమాధానములును, దురాచార దురభ్యాసములను నిరసించునట్టి కథలు, ప్రహసనములును భక్తిజ్ఞానవిరాగాదివిషయములును. మున్నగు ననేకము లిందు వివరింపబడుచుండును. ప్రతిమాసము నేదియో యొక ముఖ్యగ్రంథ మిందు ప్రకటింపబడుచుండును. చందాదారులకు మా గ్రంథములన్నియు తక్కువ ధరల కీయబడును. చందాదారులకు తక్కువధరలకు తక్కువరేట్లకు రోగ సలహాలియ్యబడును. ప్రతి చందాదారుడు సంపుటముయొక్క మొదటిసంచికనుండి తీసికొనవలసి యుండును. చందా ముందుగనే మనియార్డరుచేసిన రు 0-2-0 ఖర్చు. మేము వి. పి. గా బంపిన రు 0-4-0 ఖర్చగును. సం.రం చందా రు 3-0-0.

విడిప్రతి రు 0—6—0.

అడ్రసు:—మేనేజరు, ప్రకృతి, బెజవాడ.

---

# ప్రకృతియొక్క ప్రకృతి.

మా ప్రకృతి పత్రికనుగూర్చి కీర్తిశేషులగు శ్రీమాన్ వైద్యరత్న, పండిత డి. గోపాలాచార్యులు, ఆయుర్వేద మార్తాండ భిషఙ్మణి, ఎ. వి. యస్., ఎ. ఎమ్. బి. గారు తమ "శ్రీ ధన్వంతరీ" పత్రికారత్నమున నిటులు వ్రాసిరి:

---

అడ్రెసు:— మేనేజరు, ప్రకృతిఆఫీసు, బెజవాడ.

## ప్రతి చందాదారులకు తగ్గింపు ధరలు.

"విజయవాటిక (బెజవాడ) యందు ప్రచురింపబడు "ప్రకృతి" యను మాసపత్రిక యొక్క ప్రథమ సంచికయు వాని కనుబంధమగు కరపత్రములును మా కార్యస్థాన మలంకరించినవి. ఇందలి వ్యాసములు పత్రికయొక్క ఆశయమును బోధించుచున్నవి. ఇందలి వేదోక్తమైన యౌషధమెయ్యది? ఇంఫ్లుయెంజా సూక్ష్మజీవులు వ్యాధులను గలిగించునా? అను శీర్షికలతో గూడి వ్యాసములు ప్రశంసార్హములు. స్వాస్థ్యరక్షకములై ఈశ్వరబోధితములై సహజములగు స్వస్వధర్మముల కనుకూలములైన ఆహారవిహారముల నెఱింగించు ఈప్రకృతియొక్క ప్రకృతిమైయున్నది. ఉత్పన్న వ్యాధులను శమింపజేయు పత్రికలవలెగాక ఇయ్యది వ్యాధ్యనుత్పాదములను సూచించుటయే ప్రధానాభిప్రాయము గలదగుటచే సర్వజనాదరణీయమై యున్నది. ఈపత్రికయొక్క ఆశయమును లిక్కాలమునందలి నవనాగరికపు వైద్యవిధానములకు దూరములైనను ఆర్షసంతతి దేశికులచే నుపదిష్టములగు నియ్యవి భారతీయుల ప్రకృత్యాదుల కనుకూలములును, స్వాస్థ్యపరిపోషకములును నైయున్నవి. ఇట్టి పత్రికారాజములు నవనాగరిక వైద్యవిద్యావిధానములచే వికసితములైన మనోభావములు గల మానవుల కత్యావశ్యకములైయున్నవి. పత్రికాధిపతులు స్వవిషయమున జూపినటుల ప్రాకృతచికిత్సలను విపులముగ వెల్లడించుటకై యీపత్రికకు శ్రీ ధన్వంతర్యనుగ్రహమున మాహృదయపూర్వకమైన స్వాగతము నిచ్చుచున్నారము. ఇది సర్వజనోపయోగము గునట్లు వార్షిక చందా ............మాత్రమే ఏర్పఱుపబడినది. ఇట్టి సులభలభ్యమైన యీపత్రిక నందఱును గ్రహించి స్వాస్థ్యమును బొందుదురుగాక."

---

అడ్రెసు:— మేనేజరు, ప్రకృతిఆఫీసు, బెజవాడ.

ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు.

# తొట్టివైద్యము.

గ్రంథకర్త:—డాక్టరు పుచ్చా వెంకట్రామయ్యగారు.

ఇందులో కూనేగారి "అభినవ వైద్యశాస్త్రము, ముఖ వైఖరీ విద్య రోగరోగ్యవివేకము. శిశుపోషణము" అను నాలుగు గ్రంథములలోని విషయములన్నియు సులభశైలిని వ్రాయబడియున్నవి. తొట్టిస్నానములగూర్చి తెలిసికొనగోరు వారు వేఱొకగ్రంథము చదువనక్కరలేదు. రోగులకు కలుగు సందేహములన్నిటికి సమాధానములు ప్రశ్నోత్తరములుగా వ్రాయబడినవి, వైద్యసహాయము లేకనే సకలరోగములను సులభముగ కుదుర్చుకొనవచ్చును. ఇందులో 70 పటములు, 4 భాగములు, 34 అధ్యాయములు, 6 అనుబంధములు వెరశి 400 పుటలు గలవు. గ్లేజుకాగితము. చక్కని బైండు. ప్రకృతి చందాదారులకు వెల రు2-8-0 మాత్రమే ఇతరులకు రు 3-0-0

వలయువారు:—

మేనేజరు, ప్రకృతి ఆఫీసు,

బెజవాడ.

అడ్రెసు:—మేనేజరు, ప్రకృతిఆఫీసు, బెజవాడ.

ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు.

# ప్రకృతి పత్రికా నియమములు

1. ప్రకృతి కార్యాలయము 1919 సం॥ అగస్టు నెలలో స్థాపింపబడి ధర్మప్రతిష్ఠాపనము (trust)గా రిజస్టరు చేయబడినది.
2. ఆరోగ్యసంపాదనము, ఆరోగ్యరక్షణము, సకలరోగ నివారణము, నిరౌషధ చికిత్సా విధానము, రోగాద్వైత చికిత్సాద్వైత సిద్ధాంతములు, సహజజీవనము మున్నగువానిని గూర్చి జనులకు బోధించుటయే కార్యాలయము యొక్క ముఖ్యోద్దేశము.
3. చందాదారులు ఏ నెలలో చేరినను సంపుటముయొక్క అగస్టు నెల సంచిక మొదలు, జులై నెల సంచిక వరకు అనగా 1 మొ॥ 12 వరకు తీసికొనవలసియుండురు.
4. రిప్లయికార్డుగాని, పోస్టేజి స్టాంపుగాని పంపినచో జవాబు లివ్వబడును.
5. చికిత్ససంబంధమగు సలహాలుగాని, ప్రశ్నలకు జవాబుగాని చికిత్సా పరికరములుగాని, కోరువారు పోస్టు బిళ్లలతో, డాక్టరు పుచ్చా వెంకటామయ్యగారు, దంతలూరు అగ్రహారం, కొల్లిపర పోస్టు, తెనాలితాలూకా, గుంటూరుజిల్లా అని జవాబులు వ్రాయవలెను.
6. చందాలు, విరాళములు, ధర్మములు, గ్రంథములు పత్రికలు మున్నగునవి బెజవాడ పంపవలెను.

మేనేజరు, ప్రకృతి, బెజవాడ.

ని.

ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు—

# నైపీయ జల చికిత్స.

ఇది వివిధవిధముల జలము నుపయోగించి చేసికొనదగు దైశిక చికిత్స సర్వాంగచికిత్సలను విధించుచు కట్లు, స్నానములు, ప్రక్షాళనములు, పానములు, ఆవిరులు మున్నగు ప్రయోగములను తెలుపు పటములతో నత్యంతోపయుక్తమగు జలచికిత్సను బోధించుచున్నది. ఇందు సుమారు 24 పటములు కలవు. ఇయ్యది ఫాదర్ నీప్ గారి ఆంగ్లగ్రంథమునకు పుచ్చా వెంకటాద్రియయ్యగారి ఆంధ్రానువాదము. ఇందు యం. ప్లేటెన్ గారి ప్రాకృతచికిత్సా శాస్త్రమునుండి గైకొని శ్రీమతి జ్ఞానాంబగారిచే తెనిగి పబడిన శ్రీ నీపుగారి జీవితచారిత్రము కలదు.

వెల 0—12—0

చందాదారులకు 0— 8—0

# జస్టు చికిత్స

ఇది జర్మనీదేశీయుఁడును, పరమభక్తుఁడును, కేవల ఫలాహారియునగు జస్టుగారిచే రచింపబడిన రిటరన్ టు నేచరు అను గ్రంథమునకు కొండిపర్తి వీరభద్రాచార్యులుగారిచే సంక్షిప్తముగ తెనిగింపబడిన సారసంగ్రహము ఎనీమాలు, ఆవిరియంత్రములు, తొట్లు మున్నగు కృత్రిమ పరికరములవసర ములేకుండనే సహజ చికిత్సలతో రోగనివృత్తి చేసుకొను విధానము నిది బోధించుచున్నది. ఇందు శ్రీమతి జ్ఞానాంబగారిచే వ్రాయబడిన జస్టుగారి జీవితమును రివరెండ్ యఫ్ స్టీర్లెగారిచే ఇంగ్లీషులో వ్రాయబడిన Back

అడ్రెసు:— మేనేజరు, ప్రకృతిఆఫీసు, బెజవాడ.

## ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు.

to nature & to nature's God అను వ్యాసమునకు శ్రీమతీ జ్ఞానాంబగారిచే వ్రాయబడిన ఆంధ్రాను వాదమును కలవు.

వెల 0—12—0

చందాదారులకు 0—8—0

---

## యోగ చికిత్స

ఇది శ్రీ చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రిగారిచే హిందీనుండి తెని గింపబడినది. మనోశక్తి రోగములను నివారించు పద్ధతి నిది బోధించును. బలీయములగు సంకల్పములతో ప్రాణాయామము చేయు విధానముల నిది తెలుపును.

వెల 0—6—0

చందాదారులకు 0—5—0

---

## రక్తప్రక్షాళన చికిత్స.

## Blood wash treatment.

ఇది శ్రీమాజేటి సు॥ మల్లిఖార్జునరావు గారిచే ఇంగ్లీషులోని యనేక గ్రంథములనుండి గ్రహింపబడిన విషయ సముదయ సంగ్రహము. ఉష్ణోదక తుషార ప్రయోగముతో సకలవ్యాధుల నివారించుకొను సదుపాయము నిది బోధించుచున్నది. ఈపద్ధతి నూతనముగ కనిపెట్టబడి సుప్రసిద్ధవైద్యవేత్త లచే పొగడ్తలం బొందియున్నది.

వెల 0-5-0

చందాదారులకు 0-4-0

---

అడ్రెసు:— మేనేజరు, ప్రకృతిఆఫీసు, బెజవాడ.

ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు.

# క్షీరచికిత్స క్షీరపథ్యము

ఇందు క్షీరచికిత్సయనునది డాక్టరు కేరల్ గారి వ్యాసమునకు శ్రీ కోశా వెంకటకృష్ణారావు నాయుడుగారి యనువాదము.

క్షీరపథ్యమనునది డాక్టర్ మ్యాక్ ఫేడన్ గారి వ్యాసమునకు శ్రీ బు. తి, వరదాచారి యనువాదము.

వీనిలో పాలనుపయోగించు విధములును, పాల పథ్యముతో వ్యాధులను నివారించుకొను నుపాయములును తెలుపబడినవి. వెల 0—4—0

చందాదారులకు 0—3—0

---

# స్వాభావిక చికిత్సా నియమములు

ఇది డాక్టర్ యఫ్. ఇ. బిల్జుగారి Natural method of healing అను గ్రంథమునుండి గ్రహింపబడి శ్రీమతి జ్ఞానాంబగారిచే తెనిగింపబడిన నియమములతో కూడిన పుస్తకము. వెల 0—5—0

చందాదారులకు 0—4—0

---

# తొట్టిస్నాన నియమములు

ఇది తొట్టిస్నానములు చేయువారికి మిక్కిలి సహాయకారి. ఇందు కూనే తొట్టిస్నానములు చేయునపుడు స్నాన పథ్యములాచరించుటలో ప్రమాదమురాకుండుటకై 40 నియమములు విధింపబడినవి. వెల 0—6—0

చందాదారులకు 0—5—0

---

అడ్రెసు:— మేనేజరు, ప్రకృతిఆఫీసు, బెజవాడ.

ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు.

## ప్రాకృత చికిత్సార్ణవము

ఇందు శ్రీ పుచ్చా వెంకట్రామయ్యగారిచే అకారాదిగ వ్రాయబడిన రోగచికిత్సలు, ఇతరులచే వ్రాయబడిన అనుభూతచికిత్సలు కలవు. ఒక్కొక వ్యాధియొక్క నిదానము దానిని నివారించునట్టి వివిధ చికిత్సా విధానములు తెలుపబడి, సకల వ్యాధులను నివృత్తిచేసుకొనుటకు సదుపాయము చూపబడినది.

వెల 1—8—0

చందాదారులకు 1—0—0

—————

## మహాయోగము

ఇది శ్రీ పొత్తూరి రామరాజయోగి గారిచే రచింపబడినది. ఇందు వండిన పదార్థములు, కల్పములు వీనితో పనిలేకుండనే సహజముగ యోగాభ్యాసముచేయు విధానము బోధింపబడినది. యోగాభ్యాసకులకే గాక ఆరోగ్యవంతులుగ నుండ గోరువారికెల్లరికి నీ గ్రంథము పఠనీయము.

వెల 0—12—0

చందాదారులకు 0—10—0

—————

## ఆరోగ్య ప్రభాకరము

ఇది సూర్యకిరణ చికిత్స యను గ్రంథముయొక్క అనుబంధము. దీనిలో ఏడురంగుల పటములు కలవు రంగులద్వారా మానసిక చికిత్సచేసికొను విధానమిందు వివరింప బడినది.

వెల 0—4—0

చందాదారులకు 0—3—0

చందాదారులకు తగ్గింపు ధరలు.

# శ్రీ రామతీర్థస్వామి యుపన్యాసములు

మొదటి భాగము.

ఆంగ్ల, సంస్కృతాద్యనేక భాషలలో పాండిత్యము సంపాదించి బ్రహ్మజ్ఞాన నిరతులై ఖండాంతరములలో కూడ తమ ప్రతిభను కనుబరచి యశేషయశస్సును పొంది విదేహముక్తులైన శ్రీ రామతీర్థులవారి విజయరహస్యము, భారతదేశపు ప్రస్తుతస్థితి, హిందూదేశపు ప్రస్తుతసమస్య: మాంసభక్షణము అను నాలుగువ్యాసములు శ్రీ చెరువు రామకృష్ణారావు గారిచే మృదుమధురశైలిని తెనిగింపబడి ఇందు పొందుపరపబడినవి.

వెల 0—8—0

చందాదారులకు 0—7—0

# శ్రీ రామతీర్థస్వామి యుపన్యాసములు

రెండవ భాగము.

ఇందు శ్రీస్వాములవారి సుఖము-ఆంతరంగికము, ఆత్మవికాసము అను వ్యాసములు శ్రీ చెరువు రామకృష్ణారావుగారిచే తెనిగింపబడినవి కలవు.

వెల 0—8—0

చందాదారులకు 0—7—0

# యుక్తిప్రకాశము

మహాపండితులును, వేదాంతశాస్త్రపారంగతులును, విచారసాగర,

అడ్రెసు:— మేనేజరు, ప్రకృతిఆఫీసు, బెజవాడ.

## ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు.

వృత్తిప్రభాకరాది గ్రంథకర్తలునునగు సాధునిశ్చలదాసయోగీంద్రుల వారిచే వారిచిన్నతనమున రచింపబడిన గ్రంథము. ఇందు కఠినములగు వేదాంత విషయములు సులభముగ నర్థమగునట్లు యుక్తులతో తెలుపబడినది.

వెల 0—8—0

చందాదారులకు 0—7—0

---

# ఆరోగ్యదర్పణము

ఇది మహాత్మగాంధిగారి A Guide to health అను నింగ్లీషు గ్రంథమునకు శ్రీ పుచ్చా వేంకట్రామయ్య గారి యాంధ్రానువాదము. మానవులకు ముఖ్యావశ్యకములగు సకల విషయములు నిందు చర్చింపబడినవి ఇందలి యంశములు మహాత్ముని స్వానుభవము ననుసరించి రచింపబడినవి. ఎల్లరు చదువదగిన గ్రంథము.

వెల 0—8—0

చందాదారులకు 0—7—0

---

# మలబద్ధము

ఇది శ్రీమతి జ్ఞానాంబగారిచే వ్రాయబడినది, ఇందు యస్, స్కాట్టుగారు ఆంగ్లమున రచించిన 45 మలబద్ధ నివారణోపాయములు తెనిగింపబడియున్నవి. కూనే, జస్టు, నీఫ్ వీరిచికిత్సా పద్ధతులును, సూర్య

---

## ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు.

కిరణ, మర్దన, వస్తి, వ్యాయామ, ఆహారాది చికిత్సలును వివరింపబడినవి. 25 వ్యాయామ పద్ధతులు తెలుపబడినవి. ఎంత కాలమునుండియున్న మలబద్ధమునైనను నివారింపగల వివిధ చికిత్సా విధానములు దీనిలో విశదీకరింపబడినవి. మలబద్ధమును నివారించుటయేగాక మలబద్ధావ్యాధిని రాకుండ జేయుటకు కూడ నీ గ్రంథము తోడ్పడును.

వెల 0—12—0

చందాదారులకు 0—8—0

## ఔషధ వైద్యమొక యూహాశాస్త్రము.

డాక్టరు బెర్నారుగారి "Medicine a science of guessing" అను గ్రంథమున కాంధ్రీకరణము. శ్రీమతి జ్ఞానాంబగారిచే తెనిగింపబడినది. ఔషధ వైద్యమునుగూర్చి గాంధీమహాత్ముని యభిప్రాయవ... ద్యలక్ష ణముమున్నగునవి గలవు.

...4—0

చందాదారు... ...3—0

## శిశుమాతలకొక సందేశము.

...చిక్కులు ఆరోగ్యవార సభయందు శ్రీపువా... గారు... గారొసగిన యుపన్యాసము.

...4—0

చందాదారు... ...—0

## శుక్లనష్టము

శ్రీయుత పుచ్చా వెంకట్రామయ్యగారిచే వ్రాయబడినది... పత్రిక. సంవత్సరచందా మూడు... వివిధచికిత్సా విధానములు... చందాదార్లకు ప్రకృతి చికిత్సా గ్రంథములు తగ్గింపు... ...డును.

## ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు.

## ప్రౌఢప్రభాకరము 1 భాగము.

సూర్యకిరణ చికిత్స విధానమును గనుగొనిన డాక్టరు ఇ. డి. బ్యాబిట్ గారి అపూర్వగ్రంధమగు Principles of light & colour అను గ్రంధమునకాంధ్రీకరణము. ఇయ్యది శ్రీ పుచ్చా వెంకట్రామయ్య గారిచే తెనిగింపబడినది; రంగుల వైద్యమున సంపూర్ణానుభవము నార్జించ నిచ్ఛగించువారిపాలిటి కల్పవృక్షమనదగియున్నది.

వెల 1—8—0
చందాదారులకు 1—0—0

రోగారోగ్య వివేకము [కూనేగారి గ్రంథము] 0—8—0
చందాదారులకు 0—7—6

శిశుపోషణము [కూనేగారి గ్రంధము] 1—0—0
చందాదారులకు 0—12—0

## ప్రకృతి చికిత్స. 1

ప్రకృతి సప్తమవార్షికోత్సవ సందర్భమున మ॥ రా॥ శ్రీ॥ యన్. ఏ. పంచాపకేశయ్యర్ అవర్గల్ బి. ఎ. యల్. టి. గారొసంగిన అధ్యక్షోపన్యాసము. రోగాద్వైత చికిత్సాద్వైత సిద్ధాంతములు చక్కగ వర్ణింపబడినవి.

వెల 0—4—0
చందాదారులకు 0—3—0

## ప్రకృతి చికిత్స...

...స్పార్...జ్ఞ ...రికోత్సవ ...వర చికిత్సా పద్ధతులను, సూర్య... తెనిగింపబడి...

అడ్రెసు:— మే[illegible], ప్రకృతిఆఫీసు, బెజవాడ.

## ఆరోగ్యవిషయిక గ్రంథములు

1 ఆరోగ్యాదర్శము, 2 స్వాభావిక చికిత్సానియమములు, 3 ప్రకృతి చికిత్సా ఉపన్యాసములు, 4 బాలక్రీడలు, 5 శిశు మాతలకు సందేశము, 6 ఆరోగ్యము - కామేచ్ఛ, 7 దీర్ఘాయువు, 8 సుఖప్రసవం, 9 పురుటాలు. 10 ప్రకృతి ఆరోగ్యవైద్యం.

## వివిధచికిత్సా గ్రంథములు

1 ప్రకృతి గృహవైద్యము, 2 దీర్ఘరోగ చికిత్సాసారము, 3 జాగరణ చికిత్స, 4 ప్రాకృత చికిత్సార్ణవములు, 7 భాగములు, 11 ఉపవాస చికిత్స, 12 జస్టుచికిత్స, 13 ధ్యాన చికిత్స, 14 జంబీరచికిత్స, 15 యోగచికిత్స, 16 సంవాహన చికిత్స, 17 రక్తప్రక్షాళన చికిత్స, 18 వైదికచికిత్సాపద్ధతి, 19 నిశ్శస్త్రశరీర పరిశోధన, 20 క్షయ, 21 శుక్లనష్టము.

## వేదాంత గ్రంథములు

1 యుక్తిప్రకాశము, 2 రామతీర్థస్వామి వేదాంతోపన్యాసములు రెండు భాగములు, 4 మహాయోగము, 5 నిర్విచార జీవనము, 6 అనుభవ యోగాభ్యాసము.

పైన వివరింపబడిన గ్రంథములే కాక, 1919 సంవత్సరమున స్థాపింపబడి నిర్విఘ్నముగ నడుపబడుచున్న ప్రకృతి పత్రిక వెనుకటి సంపుటములుకూడ వెలకు దొరకును. పూర్తివివరములుగల కేటలాగునకు వ్రాయుడు.

## ప్ర కృ తి ప త్రి క

ప్రతినెల 1 టవ తేదీ వెలువడు సచిత్ర సహజవైద్య మాసపత్రిక.

సంవత్సరచందా మూడు రూపాయలు మాత్రమే. చందాదార్లకు ప్రకృతి చికిత్సా గ్రంథములు తగ్గింపు ధరలకు ఇవ్వబడును.